శ్రీ

Reg. No. M. 2580 సం॥ చందా రు ౪ లు.




జమీందారీ రయితుల ఆర్థిక సాంఘిక వ్యవసాయిక భాగ్యోదయమునకు

సంపుటము ౨ | శనివారము ౩౧–౧౨–౩౨ | నెల్లూరు | సంచిక ౧౩

## ఇదియా మాటనిలకడ?

—o—

యువరాజా!

వెంకటగిరి తాలూకాలోని ధాన్యపు రేట్లుగల 24 గ్రామాదుల రైతులము ఏకమై గత పదేండ్లనాడు ధాన్యపు రేట్లు రొక్కరేట్లకు మార్చుమని మీ మీద దావాచేస్తిమి. అప్పట్లో మీకు మాకు జరిగిన రాజీలో తరము 1-కి 1 తూము వంతున తగ్గింపు రేట్లుతో తిరుగా ధాన్యపు రేటుకు మమ్ముల ఒప్పిస్తిరి. నాడు మాకు యిష్టములేకున్నను మీరు పెట్టుబాధలు పడలేక అంగీకరించితిమి.

ఆప్రకారము కొన్ని ఫసలీలు మాత్రము జరిగినది. తర్వాత 1333 ఫసలీసుస్తీ బంజరు ముజరా సందర్భమురాగా పైన రాజీగా తగ్గించబడిన రేట్లను తిరుగాకొంత హెచ్చించుకొన్నగాని ముజరా లివ్వమనియు, ఇతర నిర్బంధములు చేతుమనియు, కంచెల నివ్వమనియు బాధించిరి. గత్యంతరములేక దేముడాయని యేడుస్తూ ఒప్పుకొంటిమి.

మొదట రాజీలో తగ్గించబడిన రేట్లు దిట్టములోకూడా తగ్గించబడినను తిరుగా 1337 ఫసలీ మొదలు తిరుగా హెచ్చించి వసూలు ప్రారంభించిరి. ఈ హెచ్చించబడిన ధాన్యము సుమారు సం॥ 1-కి 200 పుట్లు వంతున న్ను 1337 ఫసలీ మొదలు ఇప్పటివరకు జరిగిన 6 ఫసలీలకు 1200 పుట్లుధాన్యము హెచ్చు యివ్వవలసినట్లు ఏర్పడినది. ఈకరవు కాలములో, ధాన్యమునకు పూర్తిధరలు పడిపోయిన కాలములో, పంటలు సరిగా పండని కాలములో, ఇంతధాన్యమును హెచ్చించి అక్రమముగా సాగుచున్నదిగదాయని చేయుట ఎంతటి నీచతమమో యోచించవలెను. మొదలు తగ్గించినామని రాజీగా ఒప్పుకొన్న నోటితోనే తిరుగా అక్రమంగా హెచ్చించినామని చెప్పుట తమబోంట్లకు తగనిపని. అందరును అబద్ధము చెప్పక నిజము చెప్పుమని తాము మన్నారు పోలింగు మీటింగులో ప్రజలకు బోధిస్తిరే! ఇది తమకు వర్తించదుకాబోలు? ప్రజలకున్యాయ మార్గమును బోధించవలసిన తమరే యీఅన్యాయములకు దిగిన సామాన్య మానవుల విషయము చెప్పవలసినదేమున్నది?

మమ్ముల నిట్టి బాధల పాల్జేయుచున్న తమరు జిల్లాబోర్డుకునిలువబడి ఓట్లు తెమ్మని మమ్ముల నడుగుటకు తమకెట్లు మనస్సు ఒప్పినదో ఈశ్వరునికే యెరుక.

ఇకనైనను తమరు చెప్పినమాటలను జ్ఞప్తిపరచుకొని ఈపేదజనమునకు పైహెచ్చుచేసిన అక్రమ ధాన్యమును వెంటనే మాఫీచేసి వసూలుచేసిన మట్టుకు మాకు ముజరా యిప్పించి మాకడుపులు మాడ్చక మీ మాట దక్కించుకొందురని ప్రార్థన.

చిత్తగించవలెను.

ధాన్యపు రేట్ల గ్రామాదుల రైతులు.

జమీందారీ రైతు
శనివారము.
౩౧—౧౨—౩౨.

## జమీందారుల భావిస్థితి

పై నుడుటముతో పీఠికాపురయువరాజుగారు మాడర్న్ రివ్యూలో వ్రాసిన వ్యాసమునకు భాషాంతరీకరణము స్థలాంతరమున కానవగును. యువరాజుగారి వ్యాసము జమీందారుల భావిస్థితిని చిత్రించుచున్నది. విద్యాధికులగు యేయొక బిడ్డలో దక్క యీరాజధాని జమీందారులందరు ఒకేవిధమున నిద్రించుచున్నారు. పూర్వపు నిరంకుశ పాలనమే సాగవలెనని దివాంధులు యింకను పొడగట్టుచుండుట దేశదౌర్భాగ్యము. అధికార యుతులగు స్వదేశ సంస్థానాధీశులకంటె జమీందారుల నిరంకుశత మిన్నుముట్టుచున్నది. రయితులను తమకుభోగ భాగ్యముల నిచ్చుటకు సృజింపబడిన బానిసలుగా కాలిక్రింద త్రొక్కబడియున్నారు. జమీందారులలో చాలామంది తగినవిద్యా, శిక్షణల కొఱవడి యుంటయే ఇందుకు కారణము. వెంకటగిరి, పర్లాకిమిడి జమీందారీలలో జరుగు అన్యాయములు వెలువరించిన గుండెలు బ్రద్దలగును. ముందునున్న గొయ్యిని గాని పరివర్తించుట హ్రస్వ దృష్టిని నిరూపించును. యువరాజుగారి హితవు కూపస్థ మండూకములకు నెగటుగా నుండుట సహజమే! యువరాజైనను జమీందారుల మేల్కొల్పు చున్నాడు. అధికారము లెట్లున్నను ఆస్థితినయినను దక్కించుకొమ్మనుచున్నాడు. లోకమునకు గనుపడు ప్రభూత్కారమును మార్చుకొని రయితులతో కలసి మెలసి యుండమనుచున్నాడు. అంతేగాని రయితుస్థితి గతుల విమర్శించుటలేదు. నేటిదిక్కుమాలిన రయితును యీస్థితికి తెచ్చినందుకు తమజాతివారి దౌష్ట్యమునకు కన్నీటి బొట్టయినను వదలుటలేదు. భావికాలపు జమీందారును జూచి వీరు జాలిగొనుచున్నారే గాని తరతరములుగా పీల్చిపిప్పి జేసి ప్రాణమాత్రావశిష్టునిగ జేసిన జమీందారుల దారుణమునకు జాలిగొనుటలేదు. ఈహిత వయినను వెంకటగిరి కుమారరాజాగారికి గిట్టకుండుటలో నాశ్చర్యములేదు. పీఠికాపుర యువరాజుగారి వ్యాసములోనను, వెంకటగిరి కుమారరాజాగారి జవాబులోనను, ఇతరులు పొరపులు చుట్టించుచున్నారని యాపత్తి పొడుచుచున్నారు. వీరియాహాలో ఈపొరపులు పుట్టించుచున్నది, రష్యా మొదలగు విదేయులు కానిచో చుట్టుప్రక్కల కష్టసుఖముల పంచుకొనవలసిన యితర రయితులు. తోడిసోదరుల కష్టములు విచారించుటకు వాకిండ్లముందరకు వచ్చుచున్నారను నదియే వీరుమోపునింద. తమకుసర్వభోగ భాగ్యములనిచ్చు రయితు సురభిని కడుపుమాడ్చి అల్లోనారాయణాయని జీర్ణకుటీరములలో యేడ్పించుచు పైకి చెప్పుకొనుటకు సయితము దిక్కులేకుండ జేసినప్పుడు ప్రక్కనివసించు రయితు యీకుటీర వాసికన్నీరు తుడిచి "ఏమినాయనా నీకష్టముల" నిఓదార్చి అతని కడుపులోని తుదను లోకమునకు ప్రకటించి నారనునదియే వీరికడుపుమంట. లోకములన్నియు స్వాతంత్ర్య దీపములు వెలిగించు కొని యీశ్వరదర్శనము జేసుకొనుచున్న యీదినములలో చుట్టుప్రక్కల వెలిగించుకొన్న దీపకళికల నత్తితియైన చూడజాలక నిర్బంధములపాలై కుములుచున్న యీజమీందారీ రయితుల రోదనములు నేడుగాకున్న లేపయినను లోకము కాంచదా? తమతప్పును గుర్తెరుగ జాలకయితరులపైబడి యేడ్పు లేల? రయితుల సర్వకష్టముల పాల్జేసి వారుచెప్పుకొను గోడునైనను విచారించ నుత్సహించని మాకుమారరాజాగారు ఇతరులపయి నిందను మోపిన మోపుదురుగాక, పీఠికాపురమువారు మోపుట మాత్రము సమంజసముకాదు. వెంకటగి కుమారరాజాగారి వ్రాతలో మధ్య వర్తిసంఘంద్వారా రయితులు, జమీందారులు తమతగవులు నిర్వర్తించు కొనవచ్చునను చున్నారు. వెంకటగిరి తగవుల తీర్చుకొనుటకు రయితులు వేలపర్యాయములు ప్రయత్నించినను రాజీకి సిద్ధపడక రాయబారముల కాలదన్నిన మాకుమారరాజాగారు యీవ్రాతలువ్రాయుట అర్థవిహీనము. నేటికయినను తమ నద్దకు రానున్న రయితుల రాయబారమును తోసిపుచ్చక తమ యింటిని ముందు చక్కబరచుకొందురని కోరుచున్నాము.

## కుమారరాజాగారు, యేమి ఉపకారముచేసిరి?

గుంటూరు జిల్లాబోర్డు ప్రెసిడెంటు కుప్పుస్వామి చౌదరిగారు ఏపార్టీకి చెందినవారయినను జిల్లాప్రజలకు వారు చేసిన సేవ ఆశ్చర్యమును గలిగించుచున్నది. దర్శి డివిజనుకు ఉత్తరము, తూర్పు, కాలిడినచో వారిసేవ ప్రత్యక్షమగును. యేవంక జూచినను రోడ్లమయమే!

మా జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారు యీవిషయమున జూపిన యుదాసీనత జిల్లాప్రజలు తర తరములవరకు మరచిపోరు. అధ్యక్ష పదవి నలంకరించినదాది జిల్లాబోర్డు ఆఫీసు మేజమెాల్లెక్కుటకే తీరుకలేని వీరు జిల్లాలో సంచరించి ప్రజల కోర్కెల నన్నించ లేదనుట పొరపాటు. జిల్లాబోర్డు మీటింగులకు సయితము హాజరుగాక సభ్యత్వమును, దానితోటి అధ్యక్షపదవిని, గోల్పోవుటయే వీరి యుదాసీనతకు తార్కాణ.

ఇందుకు కారణముగద్దు. ఇతర జిల్లాబోర్డు ప్రెసిడెంట్లు హృదయ పూర్వకముగా ప్రజలపయిగల ప్రేమ మెట్లున్నను తిరుగా ఓట్ల సంపాదనకయి ప్రజల ముందరకు వెళ్ళినప్పుడు తాము ఉదాసీనత వహించినచో యేమి సమాధానమిత్తుమాయని భయముకద్దు. కావున తమ కాలమున ఏవయినను కొన్ని మంచి కార్యములు చేసి చూపెట్టి ప్రజలకడ తమ మానము దక్కించుకొందురు.

మాబోర్డు ప్రెసిడెంటుగారు పుట్టు భోగియయి లోకదూషణలకు వెరువక పేదవారల జీవనమును సరకుసేయక తమ నిరంకుశతనే ఆచంద్రతారార్కము చిరస్థాయి జేసుకొన ప్రయత్నించు జమీందారుల తెగకు సంబధీకులు. తగిన విద్యాధిక్యతయూ మృగ్యము. సలహాదారులా లంచగొండి మిరాసిదారులగు ఉద్యోగులు. కాన లోకవృత్తము నేమాత్రము గమనించలేరు. యింతేగాక తాము జమీందారు ప్రతులగుటచే తమదుర్మార్గ నౌకరులే ఓట్లు సాంపాదనము జేతురు. కావున ప్రజల కడకరిగి సారంగనీతులు దిద్దవలసిన జాతకము పట్టుటలేదు. మేశాసనసభా యెన్నికలయినను వచ్చినచో అట్టితరి అ

# జమీందారుల ముందుస్థితి.

పిఠాపురము యువరాజా గారగు శ్రీ ఆర్. వి. యస్. జి. రామారావుగారు మాడరన్ రివ్యూ పత్రికకు యిట్లు వ్రాయుచున్నారు:—

నేను భారతదేశములో కేవలము వాదనోన్ముఖమైన పంథను పేర్కొనుచున్నచో నది జమీందారు లనవలయును. జమీందారులకు కొంతకాలములోనే చేరువలో నున్న పతనము కర్ణపాతితమయి యున్నది. వివేకము గల జమీందారు డెవ్వరయినను తన భావికాలము గూర్చి పర్యాలోచనము గావించుకొన్నచో భీతావహము పొడముట తప్ప వేరేమియును గానిపించుట లేదు. కాని నేను భూస్వాములని పిలువబడుచున్న యీ జమీందారులలో భావిని గూర్చి యాలోచించుకొనువారే తక్కువ. వారియందును బుజువయిన పద్ధతిలో నాలోచించు వారంతకంటె తక్కువ. ఒకవేళ నిట్టివారు కొందరున్నను, వారిమాట అశ్రద్ధాలసులయిన యధిక సంఖ్యలలో బాటి కెక్కుట లేదు. జమీందారు లిప్పుడు జాగ్రత్తగలిగి రానున్న మహాపదను దప్పించుకొనుటకు మాఱుచున్న నీదేశములో జమీందారుల యూరుపేరులు లేకుండ చేయబోవుచున్న ప్రధాన సమస్యలకు లెక్కసేయక నిద్రించుచున్నారు. జమీందారుల యీ యశ్రద్ధకంటె నవివేకమయిన విషాదకరమయిన కృత్యము వేఱొక్కటి లేదు. ఈ యజ్ఞానమునకు, ఈ శిథిలీకరణమునకును వారు తగిన ఫల మనుభవింప వలసి యున్నది. ఇప్పటికైనను జమీందారులు మేల్కాంచి, వచ్చిన వాని పెండ్లికి వచ్చినదే కట్నమనినట్లు కొంతయయినను జాగ్రత్త పడవలసి యున్నది. జమీందారుల రోజులు గతించినవి. వారిపతనము తప్పదు. పతనము వచ్చుగాక, జమీందారులు దానిని సర్వవిధముల నిరోధింపకుండ లొంగిపోకుందురు గాక!

పూర్వపు రోజులు గతించినవి. ప్రభువుల యౌదార్యమును, రయితుల భక్తియు నిప్పు డర్థశూన్యము లయినవి. ఏక రాజకము, దాని నిరంకుశత్వమును వెనుకటి సంగతులు. నేడు ప్రజాస్వామికము సర్వాతిశాయియయిన యాదర్శమయినది. ప్రభుసేవకు లన్నశబ్దములే యుపహాస్య పాత్రము లగుచున్నవి. స్వాతంత్ర్యము, సమానత్వము సోదరత్వమునను మహోత్సవముల శ్రవణ గోచరము లగుచున్నవి. మహాశక్తివంతములైన ప్రభుత్వములు గూడా ప్రజా స్వామికములుగా మారిపోయినవి. ఏకరాజకచ్ఛాయ యింకను నిలువకున్నయింగ్లాండు, జపాను దేశములలో గూడ నిజమైనయేకరాజకము లేదు. ఆదేశములలో ప్రజాస్వామిక తుల్యమైన యేకరాజకములు సాగుచున్నవి. ఫ్రాన్సులోని బోర్బను రాజన్యులస్తమించిరి. ఆస్ట్రియా యందలి హాప్సుబర్గు సమ్రాట్టులు పోయిరి. రష్యా మహాసామ్రాట్టు ప్రపంచ విస్మృతుడైనాడు. లోకమును గబళింప నుప్పొంగిన జర్మనీ కైజరు చక్రవర్తి చేతగానివాడై యొకమూల గూర్చున్నాడు. స్పెయిను రాజు ప్రవాస మనుభవించుచున్నాడు. ప్రపంచములో రాజకీయ భావ పరిణామమంతయు స్వాతంత్ర్యమును, స్వాధికారమును లక్షించుచున్నది. పాశ్చాత్యదేశము లందైన నేమి, ప్రాచ్య దేశములందైన నేమి ప్రజా స్వామికావశ్యములే ప్రజాదరణీయము లగుచున్నవి. ప్రపంచ పరిస్థితులిట్లుండగా భారతదేశములో జమీందారులకు కష్టకాలము వచ్చి పడినదనుటలో నాశ్చర్యములేదు. అంత లంతలు మహాప్రభువులే పడిపోయినప్పుడీ చిన్నజమీందారుల స్థితి యెట్లుండునో తేలికగానే యూహించుకొనవచ్చును. నిజమునకు రష్యావంటి పరిపూర్ణ ప్రజాస్వామికములో జమీందారునకు గౌరవార్హమైన స్థానములేదు. మరిరష్యా భారతదేశమునకు పొరుగు దేశమేగదా! రష్యావారు భారతదేశమున సమిష్టి వాదమును ప్రవేశ పెట్ట నిశ్చయించుకొన్నచో వారట్లే చేయుదురు.

భారతదేశములో సమిష్టివాదము గాని, బాల్షివిజము గాని ప్రబలినచో జమీందారులును, సంస్థానాధిపతులును తుడిచి వేయబడుదురు. అప్పుడు వారి నెవరును రక్షింప జాలరు. కాని యిది యెప్పుడో రానున్న మహాప్రళయము.

సమిష్టివాదము రాకపోయినను జమీందారుల పతనము తప్పదు. ప్రజలకు జమీందారులన్నచో నిష్టములేదు. జమీందారుల సొంతరయితులే వారిని విషమువలె జూచుచున్నారు. ముందుముందు భారత శాసన సభల యందు గాని, రాష్ట్రీయ శాసన సభలయందుగాని, రయితులును, ప్రజాప్రతినిధులును నధిక సంఖ్యులయి యుందురు. పెత్తన మంతయు వారిదే యగును. స్వతంత్రమైన శాసన సభలో మెజారిటీ వారు వారి యిష్టము వచ్చినట్లు చేయగలరు. స్వపరిపాలనము గల దేశములో, రాజకీయ రక్షణలని పిలువబడునవి వట్టి నిష్ఫలములై యుండును. ఏ సంఘమునకైనను ప్రజల సద్భావమే తగిన రక్షణ మగును. కాని దురదృష్టవశమున ప్రజలు సద్భావమును బడయుటకు మన జమీందారుల కట్టి యవకాశమును లేదు.

శాసన సభలోని ప్రజా ప్రతినిధులు, జమీందారులను ప్రజలకును, రయితులకును, విరోధులుగా బరిగణింతురు. కాని జమీందారులు నిజముగా ప్రజలకు విరోధులు గానక్కరలేదు. జమీందారుడును, రయితును నొక వస్తువుయొక్క స్వరూపద్వయమే. ఒక్క మొక్కను బుట్టిన పువ్వుల జంటయే. వారు పరస్పరాభ్యుదయము కొఱకు గష్టించు సహచరులు కావలయును. కాని యిది చాల మేలెంచు నూహ. ఇది యుండవలసిన పద్ధతిగాని యిప్పుడున్న పద్ధతికాదు. ఇప్పుడు జమీందారుల పార్టీ రయితులపార్టీ యను రెండు పార్టీలున్నవి. జమీందారులు రయితులపై ననుమానము వహించుచున్నారు. రయితులకు జమీందారులపై విశ్వాసములేకున్నది. ఈ పరస్పర విశ్వాసము తుదకు సర్వ నాశనకరమగును. ఇట్టి పార్టీలు లేనిచోట గూడ స్వార్థపరులు కొందరు కుట్రలుచేసి పొలుపులు పుట్టించుచున్నారు. ఈ విధముగా జమీందారులు ప్రజల విశ్వాసమును గోల్పోయిరి. ఇందు గొంతవఱకు రయితులే కారకులైనను, కొంతవఱకు కీర్తిశేషులకు జమీందారులు గూడ కారకులే యగుదురు. కాని యీ బాధ్యత యంతయు నెక్కువ భాగము పీడిస్వార్థపరులను బోలుపులు పెట్టుచున్న మధ్యస్థులకు జెందవలసియుండును. ఇంతకును దీని కెవ్వరు బాధ్యులైనను వచ్చిన యాపద మాత్రము చాల విపరీతమైనది. రయితుల ప్రతినిధు లెప్పుడును నధిక సంఖ్యాకులై యుందురు. గావున, వారు తమ విరోధులైన జమీందారులపై సర్వవిధముల కసిదీర్చుకొని నాశనము చేయజూచెదరు. జమీందారుల కపకారములైన శాసనములు చేయబడును. జమీందారులకు పెద్ద పెద్ద పన్నులు వేసి క్రొత్తగా జమీకి వచ్చిన వారల్లరును వారసత్వపు పన్నులు గట్టవలయునని విధించెదరు. ఈనాడు సర్వదేశములందును, భూమియంతయు ప్రభుత్వాధీనము కావలయు ననుట ప్రసిద్ధాదర్శమగుచుండుట వలన జమీందారుల జమీలను స్వాధీన పరచుకొందురు. జమీందారుల రాజగృహములు పేదలకు నివాసయోగ్యములు గావింప బడును. వారియాస్తి, బిరుదములు, దర్జాల నన్నిటి నూడబెరికి దరిద్రులు గాచేసి వెడల గొట్టెదరు. అప్పుడు రయితు లెల్లరును "వీరికి తగినశాస్తి జరిగినదిలే, మనల నెల్లరిని సర్వవిధముల వేధించుకొనితిన్నా" రని సంతోషింతురు. అప్పుడు జమీందారులు, "కావచ్చును. కాని మాకిట్టి యపచారము జరుగవచ్చునా" యని విలపింతురు.

అప్పుడు రయితును మెచ్చుకొనవలయునో జమీందారుని జూచి జాలి నొందవలయునో, వివాదగ్రస్తమైన విషయము. అది విమర్శకుల యభిరుచిని బట్టియుండును. కాని జమీందారుల భవిష్యత్తుమాత్రము ప్రమాదసంకులమై యున్నది. ఇందెవ్వరికైన సందేహమున్నచో వారొక్కసారి వెనుదిరిగి సింహావలోకనము చేసికొనదగును. చరిత్ర పునరావృత్తి నొందును. రయితులకును, సామాన్య ప్రజలకును దేశముపై సర్వాధికారములును లభించినప్పుడు క్రోధోద్రిక్తులైన వారి చేతులలో జమీందారుల, భూస్వాముల గతి యెట్లగునో తెలిసికొనుటకు ఫ్రెంచివిప్లవమే నిదర్శనము. వారిచేతలను గాదనుటకు గాని, వారి నదమాయించుటకు గాని యెవ్వరు?

అంతకంటె నిటీవల జరిగిన రష్యాను విప్లవమును గమనించినచో జమీందారులకు రానున్న మహాపదను జక్కగా దెలియగలదు. రష్యాలో రాజకుటుంబము వారెల్లరును హత్యచేయబడిరి. రాజవల్లభులెల్లరికిని గలసర్వస్వము స్వాధీనము చేసికొ

నది. వారుప్రాణములను గాచుకొనుటకై పరదేశములకు పారిపోవలసి వచ్చినది. నేడువారు వివిధ దేశములలో నానా నీచ కృత్యములను గావించి పొట్టపోసికొన వలసి వచ్చుచున్నది. రష్యా జమీందారులు కొందరు ప్యారిసు మున్నగు నగరములలో హోటేలులను కాచుచున్నారు. వారిలో మరికొందరు సముద్రపు ఓడలలో చిన్నయుద్యోగులుగా పని చేయుచున్నారు. వారికుటుంబములు విదేశములలో దిక్కులేక యల్లాడుచున్నారు. ఇట్టి నీచస్థితికి వారు తగియుందురో, లేదో మరితెలుసంగతి. కాని యీ యుదాహరణములచేత రష్యా విప్లవము యొక్క కార్యకారణ భావములను చక్కగా బరిశీలించుకొని, జమీందారులు తిరుగు రానున్న యాపత్తు స్వరూపమును సరిగా గ్రహించుకొన గలరు. మన భారత దేశపు మహారాజులు గాని, జమీందారులు గాని, లండనులో పందెమ్ములనో, లేక యే హోటలు సందైన చెప్పులు తుడుచుచునో కాలక్షేపము సేయుచుండ, వారి భార్యబిడ్డలు వంటసాలలలో బనిచేయుచుండు దృశ్యమునొక్కసారి మీ భావనా వీథుల స్మరించు కొనుడు! ఇది విషాదకరమైన దృశ్యము. కానియెప్పటికో యిది నిజముగ జరుగునదియే.

అంతయును సంవత్సర మైన బూర్తిగాగడవలేదు, స్పెయిను దేశము నందేమి జరిగినదో మనముచూడనే చూచితిమి. అక్కడి జమీందారుల బిరుదులన్నియు నూడ తెలుక బడినవి, వారిధనమును స్వదేశ బ్యాంకుల నుండి తీసి, విదేశ బ్యాంకులలో వేసికొనుట కనుజ్ఞ నీయ లేదు. దేశద్రోహులని యనుమాన మున్నవారి యాస్తులన్నియు స్వాధీనము చేసుకొన బడినవి. ఇంగ్లాండు వంటి కన్సర్వేటివు దేశములలో గూడ ఆంగ్లేయ జమీందారులపై పెద్దపెద్ద పన్నులను విధించి, వారిని గూడ సామాన్యపు రయితుల స్థితికి దీసికొని వచ్చుచున్నారు. వారసత్వపు పన్నులు మున్నగు వాని భారము వలన జమీందారు లాస్తులను, గృహములను అమ్ముకొన వలసి వచ్చుచున్నది. వారుపూర్వపు దర్జానంతయు నిలబెట్టు కొన లేక దివాలా తీయదగిన స్థితిలో బడి పోయినారు. ఇదియంతయు జమీందారులపై ప్రజలకుగల యసహ్య భావము వలననే పుట్టినది. కావున ప్రపంచ చరిత్రను సామాన్యముగ నైన దెలిసికొన్న వివేక వంతుడైన జమీందారు డెవ్వడును తమ వారికి మంచి రోజులు ముందు రానున్నవని విశ్వసింపడు. పూర్వోక్తమైనరీతిని జమీందారుల ధనము, భూములు-భవనములు నన్నియు స్వాధీనము చేసికొన బడును. ఇకవారి బిడ్డలును, కుటుంబమును ప్రాణములతో వదలి పెట్టినచో ఈశ్వరాను స్తుత్యర్హమే యగును. ఇది వట్టియూహ వలన జనించిన భయముగాదు. ఇదికేవలము భవిష్యత్తున సంభవింప దగు గొన్ని యథార్థ విషయములను బట్టినిర్ణయింప బడిన విషయము.

ఇక "జమీందారు లేమి చేయవలయును"నను ప్రశ్నను బరిశీలింతము. జమీందారులకు బూర్వపు స్థితి మారినదని గ్రహింపవలెను. ఇక గర్వము మాపుట కవకాశములేదు. పను లెవ్వరో వచ్చి గర్వము దించుటకు ముందు, జమీందారులు తమంతట తామే వినయము వహింపవలయును. నిరంతరము కష్టించుచున్న ప్రజలతో సంబంధము లేక దివినుండి దిగి వచ్చిన వారివలె దూరముగా నుండుటకు వీలులేదు. రయితులతోడను, ప్రజలతోడను గలసి కట్టుగానుండి, వారి కష్ట సుఖములలో బాల్గొనవలయును. రయితులు పట్టె మోటువారని గౌణిగి నందువలన బ్రయోజనములేదు. నిజమునకు జమీందారు లెల్లరును మహానాగరకులా? నిశ్చయముగ కారు. నాగరకత యన నాత్మ వయిభవము గాని బాహ్య వేషభాషా ప్రవృత్తి కానేరదు, జమీందారులలో బలువురి కది కూడలేదు. ఇట్టి యాత్మ వైభవము లేవలయుందును ధనవంతుల యందును నొక్కచో విధముగ నుండును. అదియును గాక బ్రతుకటయే భర మయినప్పుడు నాగరకత మాట యెక్కడనుండి వచ్చును. జమీందారులు రయితుల కష్టసుఖములలో బాల్గొని, తాము గూడ వారిలోపాటు వారమే యని తలంప వలయును. జమీందారులే ప్రజలకు సహజ నాయకులు కావలయును. వారు లస్సాయట్టీ, టాల్స్టాయిల ననుకరింప వలయును. అప్పటికిని రయితులకు జమీందారులపయి విశ్వాస ప్రేమలు జనించు ననుట సంశయము. ప్రజలలో వీరిపయి ద్వేషభావ మంతగా నాటుకొని పోయినది. ఇట్టి దానికి బుద్ధిహీనులును క్రూరులు నయిన కొందరు జమీందారులు తగియుండ వచ్చును. కాని సత్పురుషులు దయా హృదయులు నయిన వారుగూడ తామెఱుంగని తప్పులకు శిక్షననుభవింప వలసి వచ్చును. ఎట్లయినను జమీందారు లనేక విధముల ప్రజల హృదయములను స్వాధీనము చేసికొనుటకు బ్రయత్నింప వగును. కొందరు ప్రజలయినను వారిని ప్రేమింతు రనుట కవకాశ మున్నది. కాని వారు స్వార్థము కొఱకు ప్రజల మనస్సులను స్వాధీనము చేసికొనుటకు బ్రయత్నింపగూడదు. ఇందు ద్రోహబుద్ధి కూడదు: వారి ప్రజాప్రేమ నిష్కల్మషమై నిర్వ్యాజ మయినది కావలయును. దానికి దగిన బహుమానము వచ్చినచో కృతార్థుడనని తలంప వచ్చును. లేదా యది వారి తప్పుకాదు. అప్పుడును నాచేత నయినంత సత్కార్యములు చేసితిని గదా యని సంతృప్తి నందవచ్చును.

ఈ రోజులలో స్వాతంత్ర్యోద్యమము విజృంభించు చున్నది. వేలకొలది జనులు లాఠీదెబ్బల వలన గాయములను లెక్కసేయ జయిళ్ళలో మక్కి పోవుచున్నారు. దేశభక్తులీ జాతీయ సంగ్రామములో వారి ధనమును, ప్రపత్తిని, ఆయతిని, ఇండ్లను, ప్రాణములను దేశముకొరకయి సమర్పించు చున్నారు. ఎవరో కొందరు తప్ప, తక్కిన జమీందారు లెల్లరును జాతీయోద్యమాభివృద్ధి కేమి చేసిరి? వారు కేవలము దయవలన నయినను నొక్క పయిసనయిన యిచ్చిరా?, లేక దేశములో నింత దుఃఖము ప్రవర్తిల్లు చుండగా సానుభూతితో నొక్కకన్నీటి బొట్టయినా విడిచిరా? ఆమాట తలపగూడదు. జమీందారు లీవిషయమున పెద్ద సంకటావస్థలో బడి వారిని యొప్పుకొనక తప్పదు. ఈస్వాతంత్ర్యోద్యమమునకు సహాయము చేయవలయునా, లేదా యను నదియే ప్రశ్న. స్వార్థము, పిరికితనము, దేశభక్తిని, ధైర్యమును జూపకుండ జేయుచున్నవి. జమీందారులు ప్రజలకు సహజనాయకు లగుటకు బనులు వారికెప్పుడునైనారు. స్వాతంత్ర్యముకొఱకు జనించిన జాతీయ ప్రబోధము నడగ ద్రొక్కుటకు బ్రయత్నించుచున్న మహాశక్తిలో జమీందారులు గూడ ఏకమైనారు. వెనుక ఫ్రెంచివిప్లవములో జమీందారులెట్లుండిరో యిప్పుడు మన జమీందారులు గూడ నట్లున్నారు. ఇట్టి స్థితిలోనే యింకను నుండినచో దానిఫలితముల ననుభవించి తీరవలయును. కాని మన జమీందారు లింగ్లాండు జమీందారుల పద్ధతి ననలంభించుట శ్రేయస్కరము. బ్రిటిషు జమీందారులు ప్రజలకు నాయకత్వము వహించి, వారిహక్కుల వాదించి పెట్టిరి. మతగురువులును, ప్రభువులును గూడ ప్రజల హక్కులకై పోరాడి జాన్ రాజు చేత మాగ్నా కార్టాపిూద సంతకము చేయించిరి. తర్వాత 1688 సంవత్సరము నందలి విప్లవము నందు గూడ ప్రభువులు నాయకత్వమును వహించిరి. తుదకు పోపుస్సు ప్రభువే రిఫారమ్సు బిల్లును వ్రాసెను. ఈ విధముగా వారు కొంత కొంత స్వార్థబుద్ధితో నైనను ప్రజాసేవ గావించితాత్కాలికముగ నైనను వారి యభిమానమును సంపాదింప గల్గిరి. కాని మన జమీందారులకు దేశమును సేవించుట కట్టిధైర్యము లేదు. అదియును గాక ప్రజల ప్రవృత్తులను సరిగా నెరింగి వారిని సేవించుటకు మన జమీందారులు పరదేశీయులను జూచి నేర్చుకొన నక్కరలేదు. మన శాస్త్రములను, ప్రాచీన పురాణాదికములను జూచినచో నీసంగతి విదితమగును. మన పూర్వులు ప్రజల కొఱకు ప్రాణములను సహిత మర్పించిరి. రాజోత్తముడైన రామచంద్రునకు ప్రజాసేవయే ప్రధానలక్షణము. ప్రజా ప్రీతి కొఱకు శ్రీరామచంద్రమూర్తి సీతాదేవిని వనవాసమునకు బంపుటకు గూడ వెనుదీయలేదు. భార్యా పరిత్యాగము దోషమే కావచ్చును గాని, యాయన ప్రజా సేవాదర్శము మాత్రము లోకోత్తరమైనది. అట్లే ఛత్రపతి శివాజీ మహారాజు గూడ ప్రజలను మొగలుల దౌష్ట్యము నుండి తప్పించుకొనుటకై రాత్రింబవళ్ళును నిద్రాహారములు లేక పోరాడలేదా? కావున ప్రజలు ద్వేషింపకుండ జేసికొనుట జమీందారుల విధి. బ్రిటిషు రాజుల యెడ జూపిన భక్తి యంతయు వ్యర్థమైనది. ప్రధాన మంత్రిసాంఘిక సమస్యను గుఱించి యిచ్చిన తీర్పులో జమీందారులకు శాసన సభలలో సరియైన ప్రాతినిధ్య మొసంగకుండుట వలననే సంగతి బయటబడి పోయినది. ప్రస్తుత శాసనములన్నియు గూడ జమీందారులకు విరుద్ధములుగానే యున్నవి. ఈవిధముగా జమీందారులకు ప్రజల క్షేమగాని, ప్రభువుల యభిమానముగాని లేకున్నది.

కావున నికనైనను జమీందారులు తప్పులను దిద్దుకొన తగిన సమయము వచ్చినది. వారు స్వార్థముల నన్నిటిని బరిత్యజించి యంతరాత్మ చెప్పినట్లు ఆలోచన నిమగ్ను లెల్లరకిని నదృశ్యముగ లభించు నా యంతర్వాణి చెప్పినట్లు ప్రవర్తింపవలయును. జమీందారులు తమ కష్ట సుఖము లన్నియు ప్రజలతోడివేయని గ్రహించి ధర్మబద్ధములైన ప్రవృత్తులన్నిటియందు వారికి సహాయము చేయవలయును. ప్రజలసుఖమే తమసుఖము, వారి దుఃఖమే మన దుఃఖముగా బ్రవర్తింపవలయును. జమీందారులును, ప్రజలును గూడి యేకోన్ముఖులు గాలయును. పూర్వాపచారముల నన్నిటిని క్షమించి విస్మరించుటయే వారి లక్షము కావలయును. జమీందారు లిట్టి పరస్పర గ్రహణము వలననే సుఖ జీవనము జరుగ గలదు గాని, జమీందారీ దర్జావలన గాదు.

మాయకులగు సామాన్యప్రజలకడ కరిగి యే తుంగభద్రకాలువో పారింతునన్నచాలు. ఇట్టి మార్గముననే యింతవరకు గడచినది.

శాసన సభా మెన్నికలు యిట్లే ఒకటి రెండు గండములు గడచినవి. లోకల్ బోర్డులయందు బిడ్డీదారుల గుండా మారుటకవకాశముంటచే మొట్లోగతము జరిగిపోయినది.

కానినేడు క్రొత్త చట్టప్రకారము బిడ్డీదారులు మూతబడినవి. కావున యెట్టివాడును ముఖద్వారముగుండనే పోవలసివచ్చినది. దీనిగుండా పోవునపుడు ప్రశ్నకునికి, గోత్ర, సూత్రములు చెప్పవలసిన అవసర మేర్పడినది. యిందులో స్వార్థపరులగు జమీందారులు చిక్కుపడి సిగ్గుతో తలవంచు కొనుచున్నారు. వీరు నేటి మధ్యాహ్నమువరకు జేసినది రయితును సర్వ నిర్బంధముల పాలుజేసి, సర్వసంపదల నపహరించి శల్యావశిష్టునిగ జేయుటయే. యీ కారణముచే తనే నేడు రయితుల పక్షమున తాము పెత్తనము జేతుమని వారిముందర మొగమెత్తి చెప్పలేక, లజ్జితులయి పోవుచున్నారు.

ఈకారణము చేతనే నేడు కుమారరాజాగారు జల్లాబోర్డు పెత్తనదారుగా వచ్చుటకు స్తానము దొరకలేదు. నిన్నటి మధ్యాహ్నము వరకు వెంకటగిరిచుట్టు ప్రక్కల పల్లెల రయితులను సాగుచున్నది గదాయని తీవ్రనిర్బంధముల పాలుజేసి, రయితు పసుధనమును సర్వ బాధలకు లోనుజేసి శాశ్వతముగా రయితుల సానుభూతిని గోల్పోవుటచే వెంకటగిరి సర్కిలునందు నిలుచుటకు అస్కారము లభింపదాయను.

వెంకటగిరి తూర్పున మూడుమైళ్ళలోగల శిద్దాగుంట సర్కిలులో నిలుచుటకు కొన్ని చిక్కులు యెదుర్కొన్నవి. శిద్దాగుంట, నిడిగల్లు మొదలగు 24 గ్రామాలు ధాన్యపు రేట్లుగలిగి అధ్వాన్నపు పరిపాలనా చక్రము క్రిందపడి పూర్తిగా నలిగిపోయి గత్యంతరము లేక, చెప్పుకొంటె దిక్కుమొక్కు విచారించు దోవలేక, ధాన్యపు రేటును రొక్క రేటుకు మార్చించుకొనుటకు కోర్టులో దావాలువేసిరి. కొన్ని కారణాంతరములచేతను, బలవంతుడగు జమీందారుతో పోరలేకను, మధ్యవర్తులు చెప్పినప్రకారము పూర్వపు రేటులో కొంత తగ్గించి ధాన్యమే చెల్లించుటకు రయితులు ఒప్పుకొనిరి. అప్పట్లో రయితును భూలోకస్వర్గమునకు మెట్లుపెట్టెదమని అనాల్గునిబంధనములు ఆనందాబ్ధి నోలలాడించిరి. ఇంతలో 24 గ్రామాల వారిని విడదీసి రయితులలో చీలికలు గల్గించిరి.

తర్వాత రెండు మూడు ఫసలీలు గడచినవి. 1333 ఫసలీ పైరుపండక సుక్కిపోయినది. రైతులు ముజరాకొరకు దేవిడి నాశ్రయించిరి. అప్పను దూరదృష్టిలేని యీ జమీందారు బిడ్డలు ఈరైతులతో, పూర్వము కోర్టు రాజీలో తగ్గించుకొన్న ధాన్యము తిరుగా హెచ్చించుకొన్నగాని ముజరాలివ్వమనియు, కంచెలలోకి పసువుల పోనివ్వమనియు, నిర్బంధింపసాగిరి. వారిష్టప్రకారము లొంగువరకు పసువుల కంచెలకు పోనివ్వక బందెలదొడ్ల బెట్టిరి. రైతులు వందలాది బందెల చెల్లించిరి. సర్వనిర్బంధములను భరించి గత్యంతరములేక దేముడా యని యేడ్చుచువారు కోరిన ప్రకారము అంగీకరించి వ్రాసుకొన్న అగ్రిమెంట్లలో సంతకముల బెట్టిరి.

నాడు ఒక్క నిడిగల్లు గ్రామము మాత్రము మూడు వందలవరకు కంచె సిపాయి బత్తాల చెల్లించి కుమారరాజాగారి వద్దకు వెళ్లి "మహానుభావా! మీరు కోరిన ప్రకారము తిరుగా ధాన్యపు రేట్లు హెచ్చించుటకు వప్పుకొన్నాము. తమరు నిర్ణయించిన కంచెకాపుదారీ బత్తాలు గట్టుకొన్నాము. మమ్ముల ఆవిధేయుల లీస్టులోనుండి తొలగించనైన తొలగించండి" అని నిడిగల్లు కాపులు 90 మంది మోటారుకడ్డముగా రోడ్డులో పడగా వారివంక కన్నెత్తైనను జూడక మోటారును ప్రక్కగా తిప్పించుకొనిపోయిరి. ఆపిర్కాలోనే తిరుగా తాను జల్లాబోర్డుకు నిలుచుటచే తనరైతే, గత పన్నెండు యేండ్ల సర్వనిర్బంధనలచే అశోకవనమునసీతబోలె గత్యంతరము గానక కాలమున కెదురు జూచుచు ధైర్యముతో నిలచియున్న రైతే, ఒకప్పుడు జమీందారు సర్వదౌష్ట్యములకు నిలయమగు వెంకటగిరిలో తిండి దొరకకుండగను, ఎస్టేటువారు తనమీద పెట్టిన క్రిమినలు కేసులలో తనపక్షము వాదించుటకు వచ్చిన నెల్లూరు వకీలుకు బండి సైతము కట్టకుండ జేసినను లొంగని రైతే, ఎస్టేటువారు హెచ్చించిన కంచెపుల్లరి కట్ట లేక గ్రామస్తులేకమైనప్పుడు 72 మంది గ్రామస్తులను చీలదీసి అక్రమ అన్యాయదావాల బెట్టి యేకాకిని జేసినప్పుడు న్యాయము, ధర్మము, అను రెండు పదముల నేనమ్ము కొని అన్ని కేసులలో నుజయమొంది చుట్టు ప్రక్క గ్రామాల ప్రజల సానుభూతిని సంపాదించుకొన్న అత్తినరము వాస్తవ్యుడు పుత్తేటి నారాయణరెడ్డియను రయితే పోటీకి నిలబడెను. ఆపిర్కాలో రయితులకు తాము జేసిన చెడుపులు, పుత్తేటి నారాయణరెడ్డిగారికి ప్రచారకులుబోలె యుపకరించెను, రయితుల ముఖముజూచి ఓట్లడుగుటకు కుమారరాజాగారికి మొగముచెల్లలేదు. అధికార్ల మూలకమున అపారతపు కథవిని యున్నవాడగుటచే లాభములేదని తీర్మానించు కొనెను.

దర్శి రయితులుగూడ వీరి త్యాగశీలనమును గుర్తెరుగని వారుకాదు.

కాబట్టి కుమారరాజాగారు తమ అధికారుల దౌష్ట్యములనమ్మి యీదర్శి సర్కిలులో నిలుచుట కేవల మనుచితమని సాహసించి చెప్పకతప్పదు. కట్టుముట్టరొచ్చు జేసుకొన్న తమసంకుచిత రాజనీతికి చింతిలుచు తమస్వస్థలపు రయితులనే చెంగదోలు కొనక రాజీకి శిద్ధముగనున్నవారిక నిసిపు కోర్కెల మన్నించి యింటిలోపోరు వు లేకుండా జేసుకొందురనియు, దర్శిసర్కిలులో మేము ఓడగొట్టినామన్న అపకీర్తికంటె తామే ఉపసంహరించు కొన్నారన్న కీర్తిశ్రోత్రిష్టులకే తావిత్తురనియు కోరుచున్నాను.

ఇవి నాయొక్కడి కోర్కెలుగావు. అందరిభావాలను క్రోడీకరించి వ్రాసినసాహసమునకు మన్నించ ప్రార్థితులు.

చిత్తగింపవలెను.

“ దర్శిరైతు ”

---

సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు, నెల్లూరు, వెంకటాద్రినాయుడు, జమీందారీ రైతు ముద్రణాలయం, గాంధిచౌక్, నెల్లూరు.